Regd No. N. 46 / M. 3813

102639

ప్రతి సోమ, గురువారము వెలువడు జాతీయ పత్రిక
సంపుటము ౧౬
సంచిక ౭౧

# గోలకొండపత్రిక

విడిపత్రిక ఒక అణా
హైదరాబాదు దక్కన్
శా. శ. ౧౮౬౩
వృషసం॥ర
మాఘ శు॥ 3
సోమవారము
౧౨-౨-౧౩౫౧ఫ.

# ఈస్టిండీస్ దీవులలో జపానుసేనలు దిగుట

## తారాకన్‌లోసేన జపానుకు లొంగిపోవుట

### జపానుసేనలపై దెబ్బతీయుటకు బర్మాసన్నాహములు

#### మలయాలో యుద్ధము

ఈజనవరి ౧౭వ తేదినుండి ౧౮వ తేదివరకు వచ్చిన వార్తలలో మలయాయుద్ధమందు బ్రిటిషుసేనలు అంతకంతకు దక్షిణమునకు మరల్పబడినట్లుగలదు- జనవరి ౧౭వ తేదిన మధ్యమలయాలో స్లింనదీప్రాంతమందు బ్రిటిషుసేనలకును జపానుసేనలకును పోరాటముజరిగినతర్వాత బ్రిటిషుసేనలుఇంకను దక్షిణమునకు తొలగించబడెను. తర్వాత మలయాలోని పెద్దపట్టణములలో రెండవదగు కౌలాలంపూరు నుండి బ్రిటిషుసేనలు జనవరి ౧౧వ తేదినాటికి తొలగించియింకను దక్షిణమునకు చేర్పబడినవి. ఈకౌలాలుంపూరు మలయాపడమటితీరంలో నున్నది- ఇదిరబ్బరుకేవ్వప్రదేశము, సెలాంగర్ ప్రాంతమందు బ్రిటిషుసేనలు సెరాంబనుకుఉత్తరమునకుతొలగించబడినవి. ఈసెరాంబను కౌలాలుంపూరుకు ౪౦మైళ్ళదక్షిణమునన్నది. కొందరుజపానీయ సైనికులు మలయాదేశీయుల వేషముతో జనవరి ౧౧వతారీకున జాహోరుఆగ్నేయభాగమున బుకిచురాన్గులోదిగిరి. ౧౮వ తారీకునాటికవి సింగపూరుకు౧౦౦మైళ్ళదూరమున మలేకాపరిహద్దులో టాంపినుపనగరముదగ్గరకుచేరినవి. మరికొన్ని జపానుసేనలు సింగపూరుకు ౧౫౦ మైళ్ళదూరమునను మలేకాకు ౪౦మైళ్ళ ఉత్తరమువనునుండు సెరెంబానులో ప్రవేశించినవి, మలయాతీరములో సెర్పాంగులోకూడ జపానుసేనలు ప్రవేశించినవి- పోయినకొలది వారములలో సింగపూరునందు క్రొత్త బ్రిటిషుసేనలును, ఆస్ట్రేలియాసేనలునుదిగినవి ఇవియుద్ధరంగములయందు అగ్రశ్రేణులకు చేర్చబడి, అక్కడినుండి మలయా జాతీయసేనలను భారతీయసేనలును వెనుకకు తొలగించబడినవి- ఇప్పుడుమలయాలోని విమానాశ్రయము లేవిగాని బ్రిటిషువారి అధీనములోలేవు కాని విమానాలు దిగేస్థలాలు అనేకములుబ్రిటిషువారి అధీనములో నున్నవి. సింగపూరులో విమానాశ్రయము లనేకములుమాత్రము బ్రిటిషువారివశములో నున్నవి- బ్రిటిషుసేనలు వెనుకకు మరలిపోవు చుండునపుడు శత్రువుకు ఉపయోగించగలదనిపించిన ప్రతివస్తువునుధ్వంసముచేసి పోయివారట-

మలయాలో ఈవిధముగా బ్రిటిషుసేనలు వెనుకకుపోవుచుండుటకుకారణము అక్కడబ్రిటిషు వారికిచాలినన్నివిమానములు లేకుండుటయే యని అక్కడినుండి వికలాంగులైవచ్చిన కొందరుఆస్ట్రేలియాసైనికులు జనవరి ౧౮వ తేదిన సిడ్నీనగరములో చెప్పినారు. మేము మొదట మలయాకుపోవునప్పుడు అక్కడఅన్నియు అమర్చిపెట్టబడినట్లు చెప్పిరిగాని మేముపోయి ౧౨ నెలలైనతర్వాత జపానుసేనలు దండెత్తివచ్చినప్పటికిచూడగా ఏమియుకనపడలేదని వారలుచెప్పినారు! ఇదివిషయమై బ్రిటిషుపార్లమెంటులో ఆక్షేపణలు చేయబడినవి. ఈపూర్వఆసియాప్రాంతమందు బ్రిటిషువారివర్యలన్నిటిని ఏకముఖముగ నడిపించుటకై ప్రత్యేకమంత్రిగా నియుక్తుడైనడఫ్‌కూపరుగారు ఇంగ్లాండుకుపిలిపించబడినారు. దక్షిణపసిఫిక్కుప్రాంతమునకంతటికిని జనరల్ వేవెల్ గారు మిత్రమండలిసేనలన్నిటిని ప్రధానాధిపతిగా నియుక్తులైనందువల్ల కేవలము బ్రిటిషుమంత్రివర్గమునకే బాధ్యులగు డఫ్‌కూపర్ గారి అధికారము అక్కరలేకగలదనుకారణముచే ఇట్లుచేయబడెనని చెప్పుచున్నారు,

జపానుసేనలుముందుకుత్రోసికొనివచ్చుచున్న కొలది, సింగపూరుపైవారలదాడులు అంతకంతకుఎక్కువైనవి. జనవరి ౧౭ వతేదినక్లాంగువద్ద ౧౧వతేదిఉదయము కౌలాలంపూరుకు ఉత్తరమున, సెరెంబానువద్ద, మువరువద్ద ౧౭వతారీకున టాంపెనువద్ద, మువరువద్ద జపానీయవిమానాలు బాంబులనువేసినవి. సింగపూరుపై జనవరి ౧౭, ౧౮,౧౯ తారీకులలో అవి బాంబులనువేసినవి. నష్టముతక్కువఅయ్యెనట. మలేకాలో జపానీయవిమానాలువేసిన బాంబులవల్లబ్రిటిషుసేనలదుర్గములు విచ్ఛిన్నములైనవట.

బ్రిటిషువారును జపానీయుల సైనికప్రధానస్థలాలపై విమానాలనుండి బాంబులనువేయుచున్నారు- ఈవిధముగా అనంబాస్‌దీవులకు ఉత్తరాన జపానునౌకలపై జనవరి ౧౭వతారీకునను సుంగీపటాని, ఈపోసింగొరాలపై ౧౮వతారీకున బ్రిటిషువిమానాలు బాంబులనువేసినవి.

సారావక్ రాజాగారు సర్ చార్లెస్‌వైయూక్ బ్రూక్‌గారు మలయాలో ఇప్పటిస్థితిగొప్పఆపాదముగ్గమున్న దేశముగునంతటి ఉపేక్ష నున్నసూచించుచున్నదనుచున్నారు, అక్కడగవర్నరుగారికిని ప్రధానసేనాధిపతికిని సంపూర్ణ కలిగినదనియు, గవర్నరుగారును, విమానదళములును, నౌకాదళమున్ను సేనాధిపతితో సహకారముచేయలేదనియు ఆరాజాగారుచెప్పినారు-

ఇప్పుడుబ్రిటిషుప్రభుత్వమువారు మలయాన్నుండి టునుండి లైసెన్సులేనిఎగుమతులను చేయరాదని ఆజ్ఞగావించినారు.

#### ఈస్టిండీసులో యుద్ధము

జపానుసేనలు జనవరి ౧౨ వ తేదిరాత్రివచ్చి వారిఈస్టిండీసులో బోర్నియోదీవికి ఈశాన్యమున తారకన్‌దీవిలోను, సెలిబీస్ ఉత్తరభాగమున మినహాసా మూనుచోట్లను, వెలుపలిరాష్ట్రాలలో అనేకచోట్లనుదిగినవి- ఇదిబహుశా ఫిలిప్పైనుదీవులదక్షిణమున మిండనావోదీవిపై దావావుకు దీవచ్చియుండును. తారకనులో రెండుకోజులు ఈస్టిండీసులోని వచ్చిసేనలుపోరాడినతర్వాత జపానుధాటికాగలేక లొంగిపోయినవి- ఇప్పుడు ఈస్టిండీసుసేనలు పోయిన ప్రదేశమునుతిరిగి రాబట్టుకొనుటకై పోరాడుచున్నవి- జపానువారివిమానాలు ఈదీవులలో సెలిబీస్‌ఉత్తరభాగమున గోరొంటాలో మీ ద ను, మెనడోకానులో పాల్మా పెరారు వనవుటసెర్నాటీకీవిపైనను బాంబులువేయగా క్రిందనుండే బిల్డింగులు పెట్రోలుసరకు దగ్ధమైనవి డచ్చివారి ఒకనౌకను జపానువారినౌకయొకటి జనవరి ౧౭వ తారీకునను ముంచివేసినదట. డచ్చివారిజలాంతర్గామియొకటి సయాంసముద్రములో జపానీయసేనలనుగొంపోవుచుండిన రెండునౌకలను ముంచివేసినదట ఇప్పుడుజపానువారివశమైన తారకన్ ముంచిపెట్రోలుగను లుండుచోటుగాని డచ్చిసేనలువాటిని జపానువారలకు చిక్కకుండునుండే ధ్వంసముచేసినవట,

#### చైనాలోయుద్ధము

చైనాలోజపానుసేనలు మంచిదెబ్బలుతిన్నవి. చాంగ్షాకుఉత్తరము జపానీయసేనలు చైనావారి ముట్టడిలో పడిపోయినవి. చాంగ్షాయుద్ధములో హతులగు జపానీయసైనికులసంఖ్య ౪౫౦౦౦ ఉండునని అంచనా వేయబడినవి. జపానీయులు ఇక్కడికిపంపించినసేనలో మూడింటరెండు పాళ్లు (దాదాపు ౩౦౦౦౦మంది) చాంగ్షాకుఉత్తరమున ౪౦మైళ్ళదూరానికిచేర్పబడి ఇంకనుఉత్తరమునకు పారిపోవునంత చైనీయసేనలువాటిని వెన్నంటి తరుముచున్నవి.

అన్హ్వి రాష్ట్రములో క్వేచివద్ద యాంగ్ట్సీనదిమీదను,ఇచాంగుకు ఈశాన్యమునను చైనాసేనలుపోరాటమును విజయముసరిపినవి. క్యాంటను వెలుపలి సర్గములను, హోనానులోయల్లోనదికిదక్షిణమున యంగ్వొఅను రైలుస్టేషనుండు పట్టణముయొక్క అగ్నియద్వారములను చైనావారలు భగ్నముగావించిరి-

యాంగ్ట్సీనదికిని యల్లోనదికినిమధ్య క్యాంటను పరిసరమునకు పోవులంఘాయి రైలుపెంటను, యాంగ్ట్సీనదిపై చాంగ్షాకు ౪౦మైళ్లఉత్తరమున ముఖ్యమైనజపానీయసేన మూడుస్థానములవైపునకును, చాంగ్షాకు ౧౬౫ మైళ్ళ నైఋత్యమునుండు నాంచాంగుపరకను చైనాసేనలుజపానీయులతో పోరాడుచున్నవి- యాంగ్ట్సీనదికిఉత్తరమున హాంకౌవద్ద నాన్యాంగునదక్షిణమున అవిపోరాడుచున్నవి-చైనావారఅత్యద్భుతమగ సుడుముచూసులో జపానీయసేనలను చైనీయులంతరిమివేసిరి-

తూర్పుహూనానురాష్ట్రములో హ్వాయాంగువద్ద చైనీయులువెలుపలికోటగోడనుపట్టుకొని ఇప్పుడు లోపలికోటగోడపై దెబ్బవేయుచున్నారు.

చైనాప్రభుత్వప్రచారశాఖమంత్రియగు వాంగ్ షిచీగారుయుద్ధాంతమున చైనాప్రభుత్వోద్దేశములుమూడని జనవరి ౧౧వ తేదిన చెప్పినారు, దురాక్రమణచేసినరాజ్యాలను నిరాయుధముగచేయుట, అన్నిరాజ్యాలకును ఆయుధధారణమునిషేధించుట అన్నిదేశాలును పరస్పరముగ ఆర్థికసహకారముచేసికొనుటకై ఒకఆర్థికసంఘమును స్థాపించుట ఇవి ఆయుద్దేశ్యములు పసిఫిక్‌ప్రాంతప్రాజ్యాల “రాజ్యాలసంధి”నిరద్దుచేసి పరస్పరసహాయము ఒడంబడిక నొకదానిని గావించుకొనవలెననియు వారుసూచించిరి.

#### థాయిలాండుపై దెబ్బ

బర్మాలోనుండి బ్రిటిషు వాయువిమానాలును, అమెరికావారివిమానాలును థాయిలాండుమీదికిపోయి అక్కడనుండే జపానీయవిమానాశ్రయములపై అప్పుడప్పుడుబాంబులను వేయుచునేయున్నవి. థాయిలాండు ఉత్తరసరిహద్దువద్దబ్రిటిషువారిపహారాసేనలుపోయి జపానీయసేనలకష్టముకు కలిగించినవి.

#### బర్మాలో శత్రుచర్యలు

బర్మాలో దక్షిణబర్మాపైనను, రంగూనుపైనను, జపానీయవిమానాలు ప్రతిరోజువచ్చి బాంబులనువేయుచున్నవి- సాధారణముగా రంగూనుఉత్తరభాగమునవున్న ఒకవిమానాశ్రయముపైకి అవిప్రతిరోజుదయమువేళవచ్చి బాంబులను వేయుచున్నవి. ఇతరప్రదేశాలలో ముఖ్యమైనవి మౌల్మీను, మర్తబాన్ అనునవి-ఒక్కొక్కప్పుడు మధ్యాహ్నమువేళకూడ రంగూనుమీదికివచ్చి బాంబులను వేయుచున్నవి- ఇట్లుజనవరి ౯ వతేది ఉగయుంచలకుజరిగినవి, కాని వాటివల్లకలుగుచున్ననష్టము చాలతక్కువయుట- బర్మాలో కొందరుకుట్రగా జపానీయవిమానాలువచ్చినపుడు వాటికివిపోస సంకేతములనుచూపుచున్నారని ఇపుడు తెలియవచ్చుచున్నది- అధికారులు అట్టివారలకుకఠినశిక్షలొసగబడునని బెదరించుచున్నారు-

బర్మాలో చైనాసేనలు ఇదొకఎక్కువవచ్చి చేరినవి- బర్మానుండి బ్రిటిషుసేనలు జపానీయసేనలపై దాడిచేయుటకు బెట్టియున్నవి-అయితే జపానీయసేనలు బర్మాపైనను సింగపూరుపైనను ఏకకాలమున దెబ్బలువేయవచ్చునను సంగతి నిమాడ వారుమరువలేరు- బర్మాలో డిసెంబరు ౨౩ వతారీకునాడుజరిగిన శత్రువిమానాలదాడిమొదటిది- ఆదాడిజరిగినపుడు రంగూనులోని సేవకులుజనులుదాగుకొనవలసినచోట్లకుపోయి దాగుకొనలేదు- అందువల్లనాదాపు వేయిమంది ఆస్పత్రులకు చేర్పబడకముందేచచ్చిరట, ౫౦౦మందికిగాయాలయ్యెనట- ఈమొత్తముసంఖ్యలోసగముమంది బర్మీయులు, తక్కినసగముమంది భారతీయులట-

#### హాంకుకాంగు

ఇప్పుడుహాంకుకాంగులో ౧౫౦౦౦మందిజపానీయులఖైదీలున్నారట.

#### ఫిలిప్పైనులలో యుద్ధము

ఫిలిప్పైనుదీవులలో అమెరికావారిసేనలు ఇంకను వెనుకకుపోయినవి-ఇప్పుడవి కొరిగిడారునుండి ౩౫మైళ్లదూరమున మండు పంపంగరాష్ట్రములోను, బాటన్ ద్వీపకల్పములోను ఉన్నవి-బాటన్‌రాష్ట్రము పంపంగ జాంబేలీస్ రాష్ట్రములలో కొన్నిభాగాలు, కారెగిడారు, మనిలాసముద్రములో కొన్నిదుర్గములును అమెరికావారివశంలోనేవున్నవి-సూబిక్, ఓలాంగాపోలుమీద అమెరికనుల వశమందే యున్నట్టు నమ్ముచున్నారు

జనవరి ౧౧౧ ,౧౮వ తేదినను జపానుసేనలు అమెరికనుసేనలమీదికిరాగా అవి వెనుకకు తరిమివేయబడెను.

మిండనావోలో ద్వీపములపై జపానుసేనలు దిగుచున్నవి-

అమెరికావారి విమానాలు వచ్చివారి ఈస్టిండీసుదీవులలో దిగుచుండిన జపానీయ సేనలపై దాడిచేయుటయందు పాల్గొన్నవి-

హవాయిదీవులపై జపానువారలు మరలదాడి చేసి, అక్కడినుండి పనామా, అలాస్కాలమీద దెబ్బకొయుటకు పోవచ్చునని హవాయిదీవులలో అమెరికాసేనలఅధిపతి జనాకీనావదేసిన తెలిపినారు-వేకుదీవిని స్వాధీనపరచుకొనుటలో మొత్తము ౭ జపానీయ యుద్ధనౌకలు నష్టములైనవని ఇపుడు లెక్కచెప్పబడినది-

జపానీయనౌకలు సామోవన్‌దీవిపై ట్యుటుయిలాలోనౌకలస్టేషనుపై జనవరి ౧౧వ తారీకున బాంబులనువేసినవి- పెద్దనష్టమేదిగానిలేదట-

#### రష్యాలోయుద్ధము

రష్యాలోచలికాలపుదెబ్బకు తాళలేకజర్మనులింకను రష్యనులచేతులనుండి తొలగుచున్నట్లు వార్తలున్నవి- జనవరి ౧౭వతారీకునుండి ౧౮వ తారీకువరకు రష్యనులు మాస్కోరంగమునందు కాలుగాకు ౯౭మైళ్లదూరమున మెంసాల్స్కు పట్టణమును, క్రిచెవో, సెర్పుస్కుపట్టణములను, వ్యాస్మాద్రికిమాస్కు-అమధ్యన రైలుబాటపైనుండులియుడినోవోను, ప్స్కొపెస్కు ప్రాంతమున కిరోవుపట్టణమును, మాలోయారోస్లావెట్సుకు పడమట ౨౦మైళ్ళదూరమున మెడినుపట్టణమును, కాలాగాకునైఋత్యమున ౪౦మైళ్ళదూరములో టిఖోనోవా-పుస్తినుఅనురైలు జంక్షనునుపట్టుకొనినారు ఇప్పుడు లెనిన్‌గ్రాడుకుదక్షిణమున ఇల్మెన్‌సరస్సుదక్షిణమున ౧౫మైళ్లదూరమున స్తారాయారూసా అనుపట్టణము రష్యావారివశములోనున్నది-

యూక్రెయినురంగంలో ఖార్కోవుపట్టణమువద్ద జర్మనుసేనలున్నవి-

క్రిమియాలో సెబాస్టపోలుకుదక్షిణమున ౧౧మైళ్లదూరములోనుండు బాలక్లావాను రష్యనులు ఆక్రమించినారు,

రష్యాలో పోలెండువారలనుండి రష్యావారి యుద్ధసహాయమునకై రెండుడివిజనులసేనను చాలినంతవుండిని గ్రహించుటకు స్టాలిను గారిలో ప్రవాసితపోలిషు ప్రభుత్వప్రధాని సికోర్స్కి-గారు ఒప్పుకొన్నారు-

#### లిబియాలో యుద్ధము

లిబియాలో బ్రిటిషుసేనలు అఘీలాప్రపైవుప్పారిపోవుచున్న జర్మనులను తరుముకొనుచు పోవుచున్నవి. ౧౫వ తేదినాటికి అఘీలానుండి మరాదాకుపోవుదారియందుండేపో హాల్ఫయా ప్రాంతములో కూడనివిజర్మనుసేనలపై దెబ్బలనువేయుచున్నవి బ్రిటిషువిమానాలు శత్రుస్థానాలపై దెబ్బలను వేయుచునేయున్నవి.

---

#### సూయెజ్ ముట్టడికై జర్మనీ సన్నాహములు!

(ఒకవిలేకరి) లండన్, జనవరి౧౫-

“విమానాలనూ, టాంకులనూ నడపడంనేర్పే వారిని ఇంకాపంపించవలసిందని టర్కీకోరింది. కాకేషియాపైనను, సూయెజుపైనను ముట్టడిజరుపడానికి, జర్మన్ సైన్యాలు టర్కీగుండా వెళ్ళడానికి ప్రయత్నిస్తవని టర్కీప్రభుత్వంవారు భావిస్తున్నారు- ఈ ప్రయత్నానికిముందు, మాల్టా “క్రీట్‌ను” స్వాధీనపరచుకున్నట్లు స్వాధీనపరచుకోడానికి జర్మనులు ప్రయత్నిస్తారనికూడా టర్కీవారు భావిస్తున్నారు,

జర్మనీకి తగరం రబ్బరులకు జపాను సప్లయి చేసేటట్లుగా ఒకవిధానం తయారవుతున్నట్లు టర్కీవారికి తెలిసిందని అంచేతనే టర్కీవారు పైవిధంగాభావించడానికి అవకాశం ఏర్పడిందని తెలుస్తోంది- హాను, జర్మనీలు తయారుచేస్తున్న అభిప్రాయప్రకారం, ఈ రెండురాజ్యాలవారూ మధ్యప్రాచ్యంలో ఎక్కడో ఒకచోట కలుసుకోవలసివుంటుంది-

అంచేత జపాను తనముట్టడి ఆస్ట్రేలియాపైకాక భారతదేశంమీదకు మరల్చుతుందేమో ఊహామాత్రమే సమన్వయం పరిపోయున్నది” అని ఈ రాజకీయ విలేఖరి వ్రాస్తున్నారు (ఆంధ్రపత్రిక)

---

#### మహబూబునగరం

జిల్లాఆంధ్రమహాసభ వాయిదా

“మహబూబునగరజిల్లా ఆంధ్రమహాసభ బండ్రవల్లిలో జరుగుటకు జిల్లాకార్యకారిణీ సభలో ౨౦-౮-౫౧ న తారీకున నిర్ణయించబడియుండెను- కాని అనివార్యకారణముల వలన ఆతేదిన సభజరుగదు- ముందువలె దినినిర్ణయించబడగానే పత్రికాముఖమున తెలుపబడును” ఇట్లుని వేడుకొను

నాన్దంతిరావు, కార్యదర్శి.

---

## కూచిపూడిభామా కలాపము

#### ఉదయశంకరు మెచ్చుకొనుట

౧౨జనవరి ౧౯౪౨ నాడు హైదరాబాదునందలి సాగరువిలాస్‌హాలులో ప్రపంచవిఖ్యాత నర్తకునివిదుట ప్రదర్శింపబడుచున్న కూచిపూడినాట్యం ప్రదర్శింపబడుటజరిగింది. నాట్యంచేసినవారు ౭౦ సం-రముల వృద్ధులు, నటరాజశ్రీ పారంగతులైన బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఆకోటిఅతిథిచైతన్యహీనమైన నాట్యకళను నేడుదీర్చిన విఖ్యాతనర్తకుడు శ్రీఉదయశంకరుడు.

శ్రీకోదండకృష్ణగారు, కూచిపూడిజట్టుద్ధరణకు కంకణముగట్టి, నిజాంరాష్ట్రమందలి ఆయాప్రదేశాలలో తమనాట్యకళా వైభవాన్ని సోదరాంధ్రులకుప్రదర్శిస్తూ హైదరాబాదురాకటయూ ఆదేశమయంలో శ్రీఉదయశంకరుడు తమనాట్యకౌశలాన్ని ప్రదర్శించటానికి గాను హైదరాబాదురాకటయూ ఒకేమాటుజరిగినవి,

పత్రికావిలేఖకులుకాక నాటిప్రదర్శనమునకు ప్రత్యేకాహ్వానమునిఁదవచ్చిన ఆంధ్ర ప్రముఖులలోముఖ్యులు మాడపాటిహనుమంతరావుగారు ప్రతాపరెడ్డిగారు, శ్రీసీతాకుమారిగారు, యమ్. కే. రావుకలిగారు

ముప్పదిఏండ్లవయసువారు, ఈనాడువయసుముదిరిన శాస్త్రిగారు సత్యభామవుండే ఏడువారాలనగలు అలంకరించుకొని జరీఅంచు పట్టుచీరెంధరించి రంగంమీదికివచ్చే ౭౦ఏండ్ల వయస్సు క్రింద మాసిపోయారు.

అమృత “సంగీత్”అనే హిందీ మాసపత్రిక ప్రకటించిన వ్యాసంలో ఆంధ్రదేశంలో నాట్యసాంప్రదాయమేమీలేక మొలదు పోయిన దనుచ్చరించి చాలా ఖిన్నుడనయాను. ఈ నాటి శ్రీశాస్త్రిగారి నాట్యసంపత్తునుచూచి ఆంధ్రుడనైన నేను చాలాగర్వపడ్డాను.

ఆవేశంలో వారివయసు మరుగుపడిపోయింది- నేనువారిలో రోజూచూస్తున్న నిస్సత్తువ ఏమాయనో ఒదిగిపోయింది- శాస్త్రియంగాను, సలక్షణంగాను, వాచికాంగికాభినయాల్లోటి వారు ౭౦ఏండ్లవయసు చేసిననాట్యం ఇకవారితోనే అంతరించునుగదాయని చాలావిచారించాను-

ఈభామాకలాపానికిముందు ౨౦ నిముషాలు నాకౌ అంబప్రార్థనజరిగింది ఆదిఅవటంలోనే సర్వసభ్యులతో ముస్తాయిన సత్యభామపాత్ర కనుసోరథాన్ని ప్రియునకు విన్నవించవలసిందని కోర్తుంది ఈసందర్భంములో శ్రీశాస్త్రిగారిప్రతిముద్రలకు పరిమితిలేదు- కాలినడకలపవుటు స్ఫూర్తినుద్దీపిస్తో అనేకవింతతికలనడచిరై- భావోద్యాలను చక్షుర్ద్వయంతోటి, హస్తవిన్యాసాల్లోటే చేసి మాయతోంటె ప్రేక్షకులవిస్మయచకితులయ్యారు. ఇదయాక దశావతారాలుపట్టదంజరిగింది. ఈనాట్యానికి విరామంలేనట్లైతే, చంద్రకాంతుల విరజిమ్మే విద్యుత్కాంతులు ఎంతోశోభనిచ్చినవి

నాట్యంసమాప్తికాగానే ఉదయశంకరులేచి గురువుగారినాట్యంచూట్టానికి అవకాశమిచ్చినందుకు తాండవకృష్ణగారికిని ప్రకాశరావుగారికిని నమస్కారములర్పించి ఇంతచక్కటిప్రదర్శనమును తాను ఇతరప్రాంతములలో ఇదివరకు చూడలేదనియు, ఇంతటి ఉత్కృష్టమునాట్య సాంప్రదాయాన్ని ఆంధ్రులు ఉదాసీనత్వముచే పోషించుకోలేకపోయారని తెలిపినారు- దీనియొక్క ప్రతిష్ఠనసంపత్తు నుండి గణింపబడదనియు ఇటువంటి కళాఖండములుగల నృత్యసాంప్రదాయాలచే గణనీయతవని చెప్పారు -శ్రీతాండవకృష్ణగారిని వారిగురువులైన శాస్త్రిగారిని చి. శాస్త్రిగారిపుత్రరత్నము గు వి-వెం-కర్యాను వారి ఆలోచన (హిమాలయ) నృత్యద్యాలను ముసపుజహ్యాసించారు-

కొమాండూరి వేంకటాచార్యులు

---

#### దక్షిణాఫ్రికాకు స్వాతంత్ర్యము

దక్షిణాఫ్రికాను స్వతంత్రప్రజాస్వామిక రాజ్యముగా ప్రకటించవలెననుకొనుచు ఒకతీర్మానమును దక్షిణాఫ్రికా శాసనసభయందు ప్రతిపక్ష నాయకుడైన డాక్టర్ మాలన్ గారు ప్రవేశపెట్టదలచితినని జనవరి ౧౯వ తేదినాడు శాసనసభయొక్క మొదటిసమావేశమునందు తెలియజేసినారు.

గోలకొండపత్రిక
వృషనామ సం॥ర మాఘ శు॥ 3 సోమవారము

# రాయలసీమ మహాసభ

పూర్వము హైదరాబాదు రాజ్యములో చేరి తర్వాత ఇంగ్లీషువారికి సైన్యం వ్యయానికిగాను కర్నూలు, కడప, అనంతపురం, బళ్లారి అనే నాలుగుజిల్లాలు దత్తము చేయబడెను. అందుచేత వాటిని సీడెడ్ డిస్ట్రిక్టులనిన్నీ దత్తమండలములనిన్నీ వ్యవహరించిరి. దత్తం బౌరవంఏమిటి యీపిచ్చిపేర్లు అని మనవారు అమండలాలకు కృష్ణరాయల సామ్రాజ్య కేంద్రస్థానాలై యున్నందున వాటిజ్ఞాపకార్థమై రాయలసీమ అని నూతన నామకరణంచేసిరి. "ఈరాయలసీమ మాదిగా ఉండెను మాదిమాకు ఇచ్చివేయవలసినదే. ఇంకామాట్లాడితే ఉత్తర సర్కారులు మావే. అవిన్నీ మాకు ఇచ్చివేయవలసినదే" అని మన ఖాయదెమిల్లత్ గారు ప్రచారంచేసిరి. అయితేవారు ఒకసంగతి మరచిపోయిరి. ౧౯౩౨ లో పార్లమెంటువారు ఒక సంస్థానాల విచారణ సమితిని ఏర్పాటుచేసియుండిరి. వారు హైదరాబాదువారికి రాయలసీమనుఇచ్చివేయునట్లును దానికి బదులుగా సికింద్రాబాదులో సైన్యమునుంచి రక్షించే భారము తమదిగా ఉండునట్లును నిర్ణయించి హైదరాబాదు ప్రభుత్వానికి తెలిపిరి. అందుపై హైదరాబాదు ప్రభుత్వమువారు ౧౮౦౦లో దత్తమండలాలనిచ్చి సైన్యరక్షణమును కోరియుంచిన అనాటి ఏర్పాట్లు అక్లేయుండవలెనవియు దత్తమండలాలు తాము తిరిగి తీసుకోనవలెయు తెలిపిరి. (పుటలు ౪౦, ౪౧, ౪౨ ఇండియన్ స్టేట్సుఎంక్వైరీ కమిటీరిపోర్టు).

ఇట్టిరాయలసీమ సమస్య అనేక సంవత్సరాలనుండి ఒకప్రత్యేక సమస్య అయిపోయినది. ఇప్పుడు రాయలసీమలోని పైనాలుగుజిల్లాలతోపాటు చిత్తూరుజిల్లాకూడ చేరియున్నది. ఈఅయిదు జిల్లాలవారు ప్రత్యేకముగా రాయలసీమ మహాసభను చేయుచున్నారు. గతవారము తాడిపత్రిలో మూడవమహాసభజరిగెను. రాయలసీమవారి నెదుర్కొనుసమస్యలు ముఖ్యముగా ఆర్థికసమస్యలై యున్నవి. రాయలసీమలోవర్షములు చాలాతక్కువ అందుచే నీటివసతులు కూడా సహజముగా తక్కువగానే ఉన్నవి. ఈకారణాలచేత ఇదిక్షామ క్షేత్రమని ప్రసిద్ధికెక్కినది. దీనికితోడుగా జనులలో విద్యావ్యాపకము తక్కువ. వ్యాపారసౌకర్యాలులేవు. ఆర్థికముగా జనులు వెనుకబడియున్నారు. రాయలసీమవారికి, ప్రభుత్వోద్యోగములలో కూడా సరియగుస్థానములేదు. వారికి పత్రికలుతక్కువ. ఉన్న వారపత్రికలకు ప్రచారములేదు. ఈకారణాలచేతవారిలో అల్పత్వశంక (Inferiority complex) ప్రబలిపోయినది. ఈవిషయంలో తెలంగానా ఆంధ్రులు వారికంటేకూడా కనిష్ఠులైయున్నారు. ఈ లెక్కప్రకారము ఆర్థికపారస్వతములందును అభివృద్ధియందును మొదటిస్థానముఉత్తరసర్కారులవారిది. రెండవస్థానము రాయలసీమవారిది. కనిష్ఠస్థానము తెలంగానావారిది ఈభావమును దృష్టియందుంచుకొన్నచో రాయలసీమవారు ఆంధ్రరాష్ట్రానికి బాహాటముగా సుముఖులుగా ఎందుకు కావటారో గ్రహించుకొనవచ్చును ఆంధ్రరాష్ట్రము సిద్ధించితే తమఅల్పత్వస్థానములో మార్పుకలుగునా! తాము ఉత్తరసర్కారులవారితో సరిసమానముగా ఉండగలుగుదురా? ఇప్పుడు తమ్ముళులు తమపై అధికారము చలాయించితే అప్పుడు ఉత్తరసర్కారుసోదరులు చెలాయింతురుకదా అనేభావన వారిలో ప్రబలియుండును రాయలసీమనాయకులు కొందరప్పుడప్పుడు ఈతాడిపత్రిసభలోను ఉత్తర సర్కారులవారు మాకేమిచేసినారుఅని వేసిన ప్రశ్నలో ఇదివ్యక్తమగుచున్నది. ఇట్టిపరిస్థితిలో శ్రీబాగ్ ఒడంబడిక ఒక దివ్యమైనజ్యోతిగావర్పడెను. ఆఒడంబడిక ప్రకారము రాయలసీమవారికి ప్రత్యేక సౌకర్యాలుండునట్లును, తుంగభద్రాప్రాజెక్టువంటి నిర్మాణాలకు ముఖ్యముగా ఆంధ్రరాష్ట్రము తోడ్పడునట్లును ఉత్తరసర్కారులకెంత ప్రాముఖ్యముండునో అంతకు ఏమాత్రమున్నూ తక్కువకాని ప్రాముఖ్యము రాయలసీమకుండునట్లును పైఒడంబడికలోని సూత్రాలభావమైయున్నది. రాయలసీమవారికింకేమిసందేహమున్నది? అదియే అర్థముకాని సమస్యగా కనబడుచున్నది.

ఈతాడిపత్రి మహాసభలో ఉపన్యాసకులందరును ఆంధ్రరాష్ట్రమునకు తాము ప్రతికూలురముకామని చెప్పినారు. కాని అందుకావించిన తీర్మానం మాత్రము సంకోచముతో కూడినట్టిదై యీవిధముగా ఉన్నది.

> రాయలసీమ నిరంతర క్షామబాధలకు గురియై ఎనలేని దరిద్రములో మునిగియున్ననూ, ఇంతవరకు, అధికారములోనున్న పాలకవర్గమువారు ఈ సీమాభివృద్ధి కవసరమగు నీటిపారుదల, పారిశ్రామిక వసతులు కల్పించుటకు ఈ సభవారు విచారించుచు వెంటనే ఆంధ్రకర్ణాటక రాష్ట్రములను విడదీసినచో రాయలసీమాభివృద్ధికి వలయు ఆర్థికాభివృద్ధి కొరవడుటచే, విభజింపబడుచున్న ఆర్థిక రాజకీయపరిహారము సమస్యలు కారణముగ ఈ సీమలో అధికభాగమునకు జలవసతిని కల్పించు తుంగభద్ర, గండికోట, కృష్ణవేణి మున్నగు ప్రాజెక్టులను తదితర ప్రాజెక్టులను నిర్మించుట, తదితర పారిశ్రామిక వసతులుకల్పించుట సాధ్యమయినంతవరకు పూర్తియగువరకు ఆంధ్రకర్ణాటక రాష్ట్రముల విభజన ఆపియుంచవలెనని ఈ సభవారి దృఢవిశ్వాసము"

పెండ్లితేనేకాని పిచ్చికుదురదు. పిచ్చికుదిరితేనేకాని పెండ్లికాదు అనున్యాయమును ఈతీర్మానము స్ఫురింపజేయుచున్నది. మద్రాసురాష్ట్రములోచేరి ఇంచుమించు ౧౫౦ ఏండ్లనుండి ఆందోళనము చేయుచువచ్చినను లభింపనట్టి తుంగభద్రాప్రాజెక్టును మద్రాసురాష్ట్రము రాయలసీమకు ముందుమాత్రము సిద్ధింపజేయుననుట కేమియు ఆధారములు కానవు. కాని శ్రీబాగ్ ఒడంబడికప్రకారము సర్వవిధాలా దానిని సిద్ధింపజేయుట ఆంధ్రరాష్ట్రముయొక్క మొదటివిధియై యుండును. మరియు తమిళ కర్ణాట మళయాళీల సమ్మేళనములో రాయలసీమవారికి ఎప్పటికిని అల్పత్వసంకోచము (Inferiority complex) ఉండితీరుతుంది. ఆంధ్రరాష్ట్రసిద్ధితో అదిపోతుంది.

పరిస్థితులిట్లుండగా రాయలసీమ నాయకులవాలోచనము లేక జనాబాహుళ్యమే ఆంధ్రరాష్ట్రసిద్ధికి సంకోచించుచున్నదా? అని యాలోచించిన జనసామాన్యమువిరుద్ధముగాలేన్నదనియే మేమన్నటికి తలపము. రాయలసీమనాయకత్వములో నొంతలోపము కనబడుచున్నది. ఆంధ్రరాష్ట్రమునకు అంతగాసుముఖులు కాని కొందరివ్యక్తుల చేతులలో ఈనాయకత్వము కనబడుచున్నది. అదే మూడవరాయలసీమ సభ ఒకప్రక్క జరుగుచుండగా దానికి పోని ప్రజలుతండోపతండములుగా ఊరిలో వేరుచో శ్రీమాన్ కలచవీడు వేంకటరమణాచార్యుల వారి అధ్యక్షతలో జరిగిన సభలో పాల్గొనిరి. అందు పప్పూరి రామచార్యులవారు ఇట్లుతెలిపిరి. "ఈ రాయలసీమసభకు ముఖ్యముగా బళ్లారి ప్రతినిధులేవచ్చిరి. ఈఊరిలో ఎక్కడను ఈ సభకు ఉత్సాహము కనబడలేదు. మరియు ఆర్థికసమస్యలు పరిష్కారమగువరకు ఆంధ్రరాష్ట్రము కూడదను అను తీర్మానమునుబళ్లారివారెప్రతిపాదించిరి" పప్పూరి రామాచారిగారును, కల్లూరి సుబ్బారావుగారును, ఒక ప్రత్యేక ప్రకటనచేసినారు. దానినిబట్టిచూడ బళ్లారివారే యీతంత్రమంతా పన్నుకొని వారే అధికసంఖ్యలలో వచ్చి మరికొందరిని ప్రతినిధులుకాని తమవారినిచేర్చి పైవిచిత్ర తీర్మానమును గెలిపించినారని స్పష్టమైనది. బళ్లారిలో యెక్కువభాగము కర్ణాటములో చేరినది. అందుచేత బళ్లారివారు ఆంధ్రరాష్ట్ర విముఖులగుటలో ఆశ్చర్యములేదు. దీనినిబట్టి ప్రజలభావాలను బాగాప్రకటించే పైయిద్దరి నాయకుల వంటివారు ఎక్కువ ప్రచారముచేసి ముందు మహాసభలో ఒక్క బళ్లారినాయకత్వము మాత్రమే ఉండకుండా చూడవలెనని అభిప్రాయపడుచున్నాము.

---

# గాంధిమహాత్ముడు కాంగ్రెసునాయకత్వమును వదలిరా?

బార్డోలీలో నిజముగా జరిగినదేమి?

కలకత్తానుండి జనవరి ౧౬వతేదిన కాంగ్రెసు అధ్యక్షులు మౌలానా అబ్దుల్ కలాంఆజాద్ గారు బార్డోలీలోజరిగిన కాంగ్రెసుకార్యసమితి తీర్మానముపట్ల గాంధిమహాత్ముని వైఖరినిగురించి ఈ క్రిందిప్రకటనచేసినారు:

"గాంధిగారు కాంగ్రెసునాయకత్వమునుండి తొలగినట్లు ఏభారతీయుడైనను బార్డోలీతీర్మానమునకు వ్యాఖ్యానముచేసినచో అతనికిగాంధిగారినిగురించిగానీ, కాంగ్రెసునుగురించిగాని ఏమియు తెలియదనుట-కాంగ్రెసు నాయకత్వమును వదలుకొనుట వారికిసాధ్యముకాదు. వారిమహాత్ముడెనికే కాంగ్రెసుసంస్థను ఒక్కటే గుణముతో బాగడదను ఇప్పుడుగాంధిగారు కాంగ్రెసుపేర సత్యాగ్రహోద్యమమును సాగించరనువిషయము మాత్రమే బార్డోలీతీర్మానము సూచించుచున్నది. అనగాగాంధిగారు కేవలముఅహింసాపద్ధతులలోనే అన్నియుద్ధములను ప్రతిఘటించుటకు సత్యాగ్రహోద్యమము సాగించదలచినారు. అందుకుగాంధిగారువిధించిన నియమములకు నిలువగలకాంగ్రెసువారలుదొరికినచో వారితరపుద్యమము సాగించదలచినారు.

నేటిభారతజాతీయకాంగ్రెసుఏమిటి? పోయిన ఇరవైరెండు సంవత్సరాలలో అద్భుతముగ అభివృద్ధిచెందిన భారతజాతీయోద్యమములు అంటే ఏమిటి? చివరకు ఇవన్నియు గాంధిమహాత్ముని మేధాశక్తిఫలితమందే- భారతజాతీయ జీవనసృష్టికర్త గాంధీగారే' మనజాతీయ జీవితంక్రుల మండివెనలు ప్రతిస్వరములుగాంధీగారిదివ్యాంగులిస్పర్శవలన జనించినవే! అటువంటి గాంధీగారు కాంగ్రెసునుయెట్లువిడిచిపెట్టగలుగుదురు? గాంధిగారు నాయకత్వమును వదలుకొందురని కాంగ్రెసుయెట్లుఆశకొనగలుగును?

గాంధిగారితో మాకుగల సంబంధమును తెలివిగావచేయుటకు ప్రపంచానికికొన్నిఉదాహరణలు తెలియపరచవలసివుంటుంది-కాని ఇప్పుడు వచ్చినచిక్కు-ఈవిషయమై ఏఉదాహరణముచెప్పలేము- గాంధిగారుఇతరగుణములలోనలెనే ఈ విషయమునకూడ సాటిలేనివారు, గాంధిగారు అనుకొన్నప్రకారము మీరు పూర్ణవిశ్వాసముతో పనిచేయగలరను నమ్మకము వారికి కుదిరినప్పుడు వారు మీకుదాసిచూపునట్లు మరెవ్వరును చూపలేరు- అట్టిపరిస్థితులలో మిమ్ములనువారు ఆదరించుక్రమము ప్రపంచములో ఏఇతరనాయకునివద్దను లేదు- అభిప్రాయభేదములు వచ్చినప్పుడు గాంధిగారు దానిని ఒప్పుకొందురు- అట్టి భేదభావాలున్ననువారు మిమ్ముల పూర్వమువలెనే ఆదరింతురు- మీరుగాంధిగారితో ఏకీభవించని విషయాలలోకూడవారు మీకు తగిన విధులుగా సలహానిత్తురు-

బార్డోలీలో జరిగినదేమనగా: ప్రత్యేకముగ ఒకవిషయమై వారికిని మాకును అభిప్రాయభేదములువచ్చినవి-మాటిమాటికి వారి సలహాకోరుట మాకు అలవాటయినది- అనేక పర్యాయములు మాకు సలహానిచ్చుటకూడా గాంధిగారికి పరిపాటిఅయినది-కార్యసమితి తీర్మానముప్రతినిరాయవలెనని నేను వారినికోరితిని-వారందుకువెంటనే సమ్మతించినారు-అందువారుఉదయానికే తీర్మానముప్రతి పూర్తిఅయినది-దానికి మేము మరికొన్ని పంక్తులుచేర్చుచు అహింసావిధానమును గురించి, బొంబాయితీర్మానములో మేము అవపాదించిన స్థితికే ఇకముందుకూడ బద్ధులమని గాంధిమహాత్మునికి మాటయిచ్చినాము.

---

# ఆంధ్రమహాసభ కార్యకారిణీ సభ

హైదరాబాదుదక్కన్ ౧౭-౧-౪౨.
నిజాంరాష్ట్రఆంధ్రమహాసభా కార్యకారిణీ సభాసమావేశము ౧౩-౧-౪౨ శుక్రవారమునాడు, శ్రీ రావినారాయణరెడ్డిగారిఅధ్యక్షతనజరిగెను. దిగువతీర్మానములు చేయబడెను,

## యుద్ధము పౌరరక్షణము

ప్రస్తుతము అంతర్జాతీయ సంఘర్షణవలన రాష్ట్రమందంతటను అసాధారణపరిస్థితులు గలిగినవి దేశీయులలో ఆర్థికముగానేగాక శాంతిభద్రతలస్థిరత్వమునకూడా పరిపరివిధములగు కలవరము కలుగుచున్నది మున్ముందు పరిస్థితులేవిధముగా మారునో నిర్ణయించుటకువీలులేదు, ఏదేనివిషయపరిస్థితియందుచు సంభవించుచో రాష్ట్రముయొక్క అంతరంగిక భద్రతనుగాపాడుటకు దేశీయుల సహాయముతో అవసరముగునంతవరకు బ్రిటిషిండియాలో స్థాపింపబడిన "సివిక్ గార్డ్సు" మాదిరిగా ప్రభుత్వమువారు మున్ముందేయేర్పాటుచేయవలయునని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు.

దేశీయులు కూడామత, సాంఘిక, రాజకీయవిభేదములువిడనాడితేనిండా ప్రభుత్వమువారికి ఈ సందర్భమున సర్వవిధముల సహాయభూతులుగా నుండవలయునని విజ్ఞప్తిచేయుచున్నాము.

ఈనున్నితసమయములో రాష్ట్రములో పనిచేయుచున్న వివిధప్రజాహితసంస్థలు తమరాజకీయ లేక యితర ఆశయములేవియున్నను పాటింపక ఈ విషయములో యేకాభిప్రాయులై ప్రభుత్వమునకు చేదోడువాదోడుగానుండి దేశీయుల శాంతిభద్రతలనుసంరక్షించుటలో తమకర్తవ్యకర్మలనువినియోగించి చిత్తశుద్ధిపూర్వకముగా పాటుబడవలయునని కోరుచున్నారు,

## కరవు పరిస్థితులు

ఈసంవత్సరము రాష్ట్రమునందలియధికప్రాంతములు క్షామబాధితములైనవి, రైతులుమిగులఅసహాయపరిస్థితుల నెదుర్కొనుటయేగాక ఒకవైపు ముఖ్యముగా అహారపదార్థములధరలు పెరుగుటచేతను మరియు పనిపాటలులేక జీవనాధారముకలుగనందునను చాలాఅలజడికలిగినది. యిట్టి పరిస్థితులనెదుర్కొనుటకై శిస్తులుతగ్గించి యితరవిధములుగా క్షామనివారణోపాయములవలంబించవలెనని ఈకార్యకారిణీసభవారు ప్రభుత్వమువారినిమున్ముందేనీ సారము హెచ్చరించియుండిరి. అయినప్పటికి అధికారులు ఈక్షామపరిస్థితుల నెదుర్కొనుటకు తగుచర్యలుప్రభుత్వమువారు గైకొనవలసిన నిర్దిష్టముగా తెలియుటలేదు, సత్వరముగాక్షామబాధిత ప్రాంతములలో రైతులయొక్కయు కూలివాండ్రయొక్కయు క్షుద్బాధానివారణకై ప్రభుత్వమువారు వెంటనే తగుచర్యగైకొనవలెనని మరియొకసారి ఈసభవారు తీర్మానించుచున్నారు.

దేశములో ఉదారహృదయులగు దాతలును ద్రవ్యవంతులును ప్రతిగ్రామములోని బీదలక్షుద్బాధానివృత్తికై అన్నదానసత్రాలు నెలకొల్పిగాని, లేక యితరవిధములగాని సహాయముచేసి ఈకష్టకాలమున నిరాధారజీవులను పోషించవలెనని ఈసభవారు ప్రార్థించుచున్నారు.

## జాగీరు చిత్తుశాసనము

జాగీరుదారుల అధికారములకు సంబంధించినచిత్తుశాసనమును సిద్ధపరచుటకై ఏర్పరుపబడిన ఉపసంఘమువారు సిద్ధపరచిన సూచనలను ఈసభవారుపరిశీలించి ఆమోదించుచు శ్రీకొండా వెంకటరంగారెడ్డి అడ్వొకేటుగారిచే సిద్ధపరుపబడిన "జాగీరుచిత్తుశాసనము"ను ఉపసంఘమువారిసూచనలసహా ప్రభుత్వమువారికిపంపుటకు తీర్మానించుచున్నారు.

---

# తాతలనాటి చీర

పండిత నెహ్రూగారిసహోదరి విజయలక్ష్మీదేవి యీమధ్య అ.భా.మహిళామహాసభకు అధ్యక్షురాలుగా కాకినాడకువచ్చినసందర్భమున ఈమెకు బొబ్బిలిపురం శ్రీ.శ్రీ. పిఠాపురం మహారాజావారు ఒకచీరె కానుకగాయిచ్చినారు-ఈచీర తాలూకునూలును శ్రీమహారాజులుంగారి పితామహి ౧౦౦సంవత్సరాలకు పూర్వం వడికియుండిరట! నూరేండ్లనాడు మన మహిళామణులకున్న పరిశ్రమాభిలాషయెట్టిదో గమనించండి!!

---

# హైదరాబాదు ధరలు

తేది ౧౭-౪-౫౧ ఫ.
పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పునధరలన్నీ పాలీవి.

| వివ్యము | పల్లా ౧కి ధర |
|---|---|
| | రూ అ పై |
| తెలిడిసాంబర్లు | ౨౪ నుండి ౨౫ వరకు |
| సంబర్లు | ౨౪ ౨౩౯ |
| ఢిల్లీబోగాలు | ౨౪ ౦ ౦ |
| రాంసాగర్లు | ౨౧ ౦ ౦ |
| వానస్రాం | ౨౨ ౦ ౦ కొత్తవి |
| ,, | ౨౪ ౦ ౦ పాతవి |
| ఆర్కాటి | ౨౧ ౦ ౦ కొత్తవి |
| ,, | ౨౫ ౦ ౦ పాతవి |
| గోవామణి | ౨౩ ౭ ౦ |
| బుడుములు | ౨౧ ౦ ౦, ౨౦౯ |
| దేశావరి | ౨౦, ౨౨వరకు |
| **గోధుమలు** | |
| షర్బతి | ౨౪ ౪ ౦అన్నిరకములు |
| బన్సి | ౨౪ ౭ ౦ వరకు |
| అమ్మకి | ౨౪ ౦ ౦ |
| పోటియా | ౨౨ ౭ ౦ |
| ఎరగోధుమలు | ౨౦ ౨౧ |
| తెల్ల జొన్నలు | ౧౦౯-౧౧ |
| పచ్చజొన్నలు | ౬ ౦ ౯, ౬ ౪ ౦ |
| సెనగలు | ౧౨ ౪ ౦వరకు |
| కందులు రాయచూరు | ౧౧ ౭ ౦ |
| మినుములు | ౧౪ ౭ ౦ |
| లంకలు | ౧౭ ౪ ౦ |
| సజ్జలు | ౧౧ ౦ ౦ |
| **పప్పులు** | |
| సెనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౩-౭-౦ ౧౬ |
| పెసరసెనగ ,, | ౨౧ ౨౨ ౭ ౦ ౨౩ |
| లంక ,, | ౨౦ ౦ ౦ |
| మినప ,, | ౨౧ ౦ ౦ ౧౯ |
| పెసర ,, | ౨౦ ౦ ౦ |
| బెల్లము ౧౬-౭-౦ నుండి ౧౬ రూ॥ ౧౨-సా॥ | |
| ఉప్పు | ౧౨, ౧౨ ౭ ౦ |
| వుల్లిగడ్డ | ౧౦ నుండి ౬ ౭౯ |
| వరుగు మిరప | ౪౦ నుండి ౩౦ వరకు కొత్తవి |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర ,, పల్లా | ౨౦ ౦ ౦ |
| కర్రచక్కెర ,, ౪౦ సే. | ౧౨ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుగు ౧౨ సే. | ౨ ౦ ౦ |
| అల్లం ,, ,, | ౨ |
| మణుగు ౧౨ సే. | |
| కొబ్బెరనూనె ,, | ౫ ౧ ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౯ ౦ |
| వేరుసెనగనూనె ,, | ౪ ౦ ౦ |
| కిరోసిన్ (గ్యాస్) ,,డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| **నెయ్యి** మణుగు ౪౦ సేర్లు | |
| విదరు నెయ్యి ,, | ౭౫ ౦ ౦ |
| తెలంగాణా ,, | ౪౫ ౦ ౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| ఆముదాలు బస్తా ౬, | ౧౧ ౦ ౦ |
| వేరుసెనగ ,, | ౭ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |
| బంగారు తు॥ ౧కి | ౫౬ ౦ ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౦ ౦ ౦ |
| ,, తు ౧కి | ౦౯ - |
| సవరన్ ౧కి పాలి రూ- | ౩౬ ౭ ౦ |
| **మారకం** | |
| పాలికి కల్దార్లు | ౧౫ ౧౩ ౧ |
| కల్దారుకు పాలీలు | ౧౫ ౧౧ ౦ |

## బొంబాయి ధరలు

(జనవరి ౧౬ వ తేదీన)

| | రూ. అ. పై. |
|---|---|
| కొవిపత్తి(ఏప్రిల్-మేవాయిదా కంట్రాక్టు) | ౨౦౫-౧-౨-౦ |

(జనవరి ౧౬ వ తేదీన)

| | |
|---|---|
| వెండి(తయారు) తులాలు౧౦౦కి | ౬౦-౧౧-౦ |
| ,, (నవంబరువాయిదా) తు.౧౦౦కి | ౬౪-౬-౦ |
| బంగారు (తయారు) తులం ౧కి, | ౪౬-౧౧-౦ |
| ,, (నవంబరు వా॥) ,, ,, | ౪౬-౫-౦ |

గమనిక:- ధరలు పైతైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము- అయినను ఏదైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు.

# Golkonda Patrika

**Volu 16 — No 71** | *Published on every Monday and Thursday — Hyderabad Dn.* | **19—1—1942**


## స్థానిక వార్తలు

హైదరాబాదు రాష్ట్రంలో కొన్ని చోట్లు మొట్టమొదటి వయసున్న కూలీలకు కొనసాగిస్తూ, అనధికారముగా పనిచేసినారు. బోరుగుల పైగా కాకుండా పెంపరాలు తగ్గించినారు. హైదరాబాదు రక్షణ శాఖ క్రింది ఈ సంవత్సరం వర్షాలు లేనందున జొన్న పంట తక్కువైంది, వరి కూడా అప్పటికంటె రెండున్నర లక్షలటన్నులవరకు తక్కువగా ఫలించినది, ఈ పరిస్థితులలో బయటికి చాలా పంపబడుచున్నవి, అందుచేత ధరలు పెరిగినవి. ధాన్యం రాష్ట్రంలో తక్కువౌతున్నది. దీనిని నిరోధించకుంటే ముందుకు భయంకర పరిస్థితులేర్పడును. జొన్న ధర నిర్ణయించుటకు వారికి ప్రభుత్వమువారు కొంత నిరోధంవిర్పాటుచేసినారు, ఆదేశమునకు అనుగుణంగా డార్ నుండి ప్రభుత్వము వెలువరిచినది జొన్నలను రాష్ట్రము వెలుపలికి యెవరున్నూ పంపకూడదని ఆజ్ఞాపించినారు, దీనికి విరుద్ధంగా ఆచరించువారికి శిక్షయియ్యబడును.

... ... ...

ఉస్మానాబాదు జిల్లాలోని కల్లంతాలూకాలోని రామకొండ అను గ్రామములో జైనుల దేవాలయమున్నది. జైనుల మతవిశ్వాస గౌరవార్థము దానిచుట్టును గూడు మైళ్ళ పరిధిలో ఎవరును జంతువులను వేటాడకూడదని హైదరాబాదు ప్రభుత్వమువారాజ్ఞాపించినారు.

... ... ...

హైదరాబాదు పురపాలక సంఘములో రాజా ధరంకరణ్ గారి పటమును మహారాష్ట్రులుగారు గత సంవత్సరమువారు బహిరంగపరిచిరి అందరుద్యంలో వారిట్లు చెప్పిరి "ఈ సంఘముయొక్క అధ్యక్షులు పూర్వమునుండి రాష్ట్రసేవను చేసిన ప్రజా మువారును ప్రభుభక్తి పరాయణులు, ముత్తులలో ఒకరును అయిన రాజాధరంకరణ్ గారి పటమును బహిర్గతము చేయుట నాకు చాలా ఆనందము, ఈ దక్కనులో అన్ని మతాలవారును చక్కగా పాలవ్రకలిసియున్నారు దీనిని స్థిరము గావించుట ఈ నగర పాలక వర్గసభ్యుల విధి వీరిని నేను ఈ ఆయిదుమాసాలనుండి బాగా ఎరుగుదును వీరు మంచి సమర్థులు, కృష్ణస్వామి ముదిరాజ్ గారు వీరి పటమును పురపాలక సంఘానికిచ్చినందుల కు వారికి ధన్యవాదములిచ్చుచున్నారు, ఈ సంఘానికి రాజకీయములతో సంబంధము ఉండకూడదు. అందరును ఏకాభిప్రాయముతో నగరవాసుల ఆరోగ్య సౌభాగ్యాభివృద్ధికి కృషిచేయవలెనని తోడ్పడవలెను.

... ... ...

ఖమ్మంలో వర్తకసంఘమువారు తమసంఘ నియమాలకు విరుద్ధముగా ఆచరించువారిని బహిష్కరింతుమని తీర్మానించినందువలన ఆ తీర్మానము హైదరాబాదు రక్షణ శాసనానికి విరుద్ధమని వారిని వారిని అరెస్టు చేసి విచారించి వారిపై నేరము స్థిరపడినదని నేరము విధించిరి. అందుపై వారు హైకోర్టులో నిగరాని చేసిరి. నవాబ్ అక్బర్ యార్ జంగ్ బహద్దరు గారు బ్రాహ్మణ రామకృష్ణారావు గారిని నిందితుల పక్షాన వాదించిరి. వర్తకసంఘమువారి తీర్మానం అట్టిదైతే అట్టివిధంగా తమ సంఘమునందు చేర్చి ఫలాలు కూడ ఆమోదించినట్లు హీనకరమైనదని చెప్పి అందుకు ఆశ్రమ సంఘములుగా బ్రిటిషు ప్రభుత్వం పక్షాన వేయబడినట్లు నిందితుల పక్షాన వాదింపబడెను. నిగరానీ అంగీకరింపబడి విచారణకై ముందు ఏర్పాటు చేసినారు.

... ... ...

మ ఘ న. నిజాం ప్రభువుగారు ఒక స్థానిక పత్రికలో అనధికార రీత్యా యీవిధంగా ఒక విజ్ఞాపనము ప్రకటించినారు. "బాగేఆమాలో ప్రదర్శనశాలయొక్క కట్టుదలకు దానికిగాను ప్రభుత్వం ౧౦౦౦౦రూ॥ ఇచ్చును. విద్యుత్తు మహామాత్యుల జిమ్మా. సర్కారుగారియొక్క పటము పోస్టరు మామ్మదు ఖాను గారు, గడియారం సర్ ముల్లా ఖాన్ గారును, కుర్చీలు మున్నగు కట్టెసామానులు పరిశ్రమల తరంవారు ప్రతివారును ధరించు లక్షల్బ్బక మానుకట్టుట క్రేన్లిగాలాలీపని. డిన్నర్ సెట్ అక్బరలీఖాను గారు ఇతర భోజనభాజనసామానులు అటవస్తువులు, రేడియో మున్నగునవి నిజాం గారు. త్రియంబక రాజా గారును రాయ గురుదాసు గారును రాజా ధరంకరణ్ గారును ఇత్తడి ఈక్లబ్బు సంవత్సరంపాటు పని చేయును.

... ... ...

జిల్లాపోలీసు డైరెక్టరు గారగు పోలిస్ గారు జనవరి నాడు ఉద్యోగం వదలుకొని- ఎఫ్-జి-ఎచ్- బెయిలీ గారు వారిస్థానములో ఉద్యోగము చేయుచున్నారు-

... ... ...

కిషన్‌గంజ్ ఆర్యసమాజ కార్యదర్శి గారు ఈ క్రిందివిధముగా తెలుపుచున్నారు "ఇదివరకు పదింగనే ఈసంవత్సరము కూడ కిషన్‌గంజ్ ఆర్యసమాజమునుండి హోలీ ఊరేగింపు తీయబడును-మరియు త్వరలోనే హైదరాబాదు నందలి అన్ని ఆర్యసమాజమందిరముల సమావేశమేర్పాటు చేయబడి పై ఊరేగింపును గురించియు యింకా యితర విషయములను గురించియు తీర్మానములు గావింపబడును."

ఉస్మానియా గ్రాజుయేట్లసభ ౯ జనవరినాడు హైదరాబాదులో ఖాజా మ. అహమ్మదు గారి అధ్యక్షతలో జరిగెను మ-ఫారూఖు గారు ఆహ్వాన సంఘాధ్యక్షులు గా ఉండిరి- అధ్యక్షులిట్లు మాట్లాడిరి, మ-౧౧-వ నిజాం గారి రాజ్యపీఠాని కెక్కినప్పుడు రాష్ట్రములో ౨౨౦,౦౦౦ విద్యవచ్చినవారుండిరి- యిప్పుడు ౧౧,౨౦,౦౦౦ మంది ఉనా రు- ఇంకను ఇతరాభివృద్ధులు చాలా జరిగినవి-ఉస్మానియా విద్యాపీఠమేర్పడింది- పురాతత్వశాఖవారు మంచిపనిచేయుచున్నారు-

... ... ...

"మచిలీబందరు హైదరాబాదునకు చెందవలెను. మచిలీబందరు హైదరాబాదు రాష్ట్రానికిచ్చివేయవలెను- జపాను యుద్ధం వచ్చినందున తూర్పుతీరం రక్షించే బాధ్యత నిజాంగారిది గా ఉండును- అని దేశసంస్థాన ముస్లింలీగు సభ్యుడగు నవాబ్ అబ్దుస్సమద్ రాజస్థానీ ఆశేల్దీకుడు ప్రకటించినాడు-

... ... ...

ఆంధ్రయువతీమండలివారు శిశుప్రదర్శనమును శ్రీమతి రుక్మాబాయి రామనరసుగారి అధ్యక్షతలో రెడ్డిహాస్టలులో ౨౩ జనవరి నాడు సాయంత్రం౪గంటలకు చేసి బహుమానాలిత్తురు-నాట్య ప్రదర్శనంమున్నగునవి కూడా జరుగును. స్త్రీలకందరికిని ఆహ్వానకలదు.

... ... ...

హైదరాబాదు ప్రభుత్వమువారు హైదరాబాదు బాగేఆమములో జరుగనున్న పరిశ్రమల ప్రదర్శనానికి ౨౦౦౦ రూ-ఇచ్చినారు-

... ... ...

అఖిలభారత విద్యాకేంద్ర సంగము (సెంట్రల్ బోర్డు) హైదరాబాదు నగరములో ౧౩ జనవరినాడు సమావేశమయ్యెను- వివిధరాష్ట్రములనుండి గొప్ప గొప్పవారు వచ్చిరి-వారందరు ప్రభుత్వాతిథులైరి-వారికి విందులు జరిగెను. వచ్చినవారిలో ముఖ్యులు రాజకుమార్ అమృతకౌర్, యన్- ఆర్- సర్కార్ సర్ జియావుద్దీన్ అహ్మద్ లాహోరు బిషప్పు గార్లును, యూనివిద్యాధికారులగు హోయి రు గారును బెంగాలువారగు బాటంలీ గారును మీరు ఇలాహీబక్ష్ గారును మున్నగువారు వీరి గౌరవార్థము అలీఘడ్ పాతవిద్యార్థులు విందు చేసిరి-

... ... ...

౧౫ జనవరి ౫వ తేదిన సికింద్రాబాదు జేమ్సు స్ట్రీటులో రంగుల వర్తకుల యొక్కయు యునైటెడ్ సామానుల వర్తకుల యొక్కయు ప్రతినిధులకు నైజాం ట్రేడింగు ఏజెన్సీవారు విందుచేసిరి-వచ్చిన ప్రతినిధులు నదరు ఏజెన్సీ ఇంతవరకు పొందిన అభివృద్ధిని చాలా మెచ్చుకొనిరి. ఈ నైజాం ట్రేడింగు ఏజెన్సీవారు మంచి మంచి రంగులను తయారుచేయు నింప్లెక్సు ఆయిల్ పెయింటు కంపెనీకి సుత్తా ఏజంట్లు డాలానవస్తుతి పదార్థములకు కూడ నేరు ఏజంట్లు ఇంతే కాక బొంబాయిలోని సింప్లెక్సు కెమికల్ కంపెనీకిని ఇండియన్ ఉల్లాస్ బాగో కంపెనీకిని వారలు గుత్తా ఏజంట్లుగా పనిచేయుచున్నారు, ఇటీవల నేవీరు (షాఫ్ ఆయిలు మిల్సు కంపెనీవారు వర్గం, ఇటార్సీలలో కార్ఖానాలయందు తయారుచేయు పదార్థాలను అమ్మించుటకునూడ ఏజంట్లుగాని యుక్తులైనారు.

... ... ...

బాగేఆమాలో కోళ్లయొక్కయు పండ్లయు, రగాయల యొక్కయు ప్రదర్శనము చాలా వైభవముగా జరిగెను-

... ... ...

మహబూబునగరములో పెంట్లవెల్లి గ్రామ వాస్తవ్యులగు చక్రపాణి నరసరాజాభట్టు హైకోర్టు వకీలుగారు ఏడవ రుసుమాలో చేరిన ముజఫర్ పూర్ జిల్లాలోని భరభుత నగరము నజరిగిన అఖిలభారత భట్టబ్రాహ్మణ మహాసభకు ఈ సంవత్సరము అధ్యక్షులుగ యెన్నుకోబడినందులకు ఈ రాష్ట్రవాసులమగు భట్టురాజ సోదరులము మహానందముతో వారి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై పరమేశ్వరుని ప్రార్థించుచు శ్రీవారు ప్రాంతీయ భట్టురాజసంఘము నొకదానిని యేర్పాటుచేసి జాతిలోని దురాచారముల తొలగించి తమతోడి సోదరుల సామాజిక, ఆర్థిక, విద్యోన్నతికై తగినయేర్పాటులను శీఘ్రములోనే ప్రారంభించగలరని కోరుచున్నాము.

వైద్యవిద్వాన్ డాక్టరు సి. యం. బాలరాజాభట్టు

... ... ...

హైదరాబాదు విద్యాపద్ధతిలో ఇకముందు అంతా ఉర్దూమయముచేయునున్న ప్రభుత్వాజ్ఞను రద్దుచేయుటకు కోరుటకై ౧౮ జనవరినాడు క్రీస్తుమత పరిసంఘములవతిన దోర్నకల్ బిషప్ గారున్నూ, ఇతర క్రైస్తవ సాంఘాలవారును, ఖాన్బహద్దర్ ప్రతినిధులు కలిసి ఒక కూరతో విద్యామంత్రిగారిని కలిసి క్రైస్తవ హిందూ పార్సీ ప్రతినిధులు ౩౦ మందిసభకు వెళ్లిరి- ఉర్దూ మాతృభాష కాని విద్యార్థులకు హైస్కూళ్లలో మాతృభాషలలో విద్య చెప్పించవలెనని వారుకోరిరి. ఉర్దూను ఇతరగతులలో నిర్బంధభాష్యతీయుభాష"- పెట్టిరి అనికోరిరి పెద్ద పెద్ద గ్రామాలలో ఇంగ్లీషులో విద్య చెప్పించుటను సెలవియ్యవలెనని విద్యామంత్రిగారు బాగా అన్నింటినివినుచున్నారు, అందుపై ఆలోచించుతాముతెలిపి అని వారిని పంపివేసినారు-

... ...

మొన్న శనివారమునాడు నిజాం కాలేజీలో ఆంధ్రయువజనసంఘమువారు తమసంఘ వార్షికోత్సవమును చేసిరి- సుప్రసిద్ధ కవి పండితులగు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు అధ్యక్షత వహించిరి-వారి అభిభాషణము వినుటకై ఆంధ్రవిద్యార్థులను, ఇతర స్కూళ్లలోను కాలేజీలలోను ఉండు పండితులు ప్రొఫెసర్లు, ప్రముఖులు వచ్చియుండిరి-విద్యార్థినులు కూడా చాలామంది యుండిరి- శ్రీ కురుగంటి సీతారామయ్య గారు కవిగారిని సభ్యులకు పరిచయపరిచిరి. తర్వాత మ॥ ఖాసీంఖాను గారు మన తెలుగు వాఙ్మయం హీనస్థితిలో నున్నదనియు, తెలుగుపత్రికలు భారతదేశమందలి ఇతర భాషాపత్రికలకన్న చాలా వెనుకబడియున్నవనియు ఈలోపాలను తీర్చుట విద్యావంతుల భారమనియు టూకీగా గంభీరముగా మాట్లాడిరి- ఆటుతర్వాత విశ్వనాథ సత్యనారాయణ గారు తమ లోకానుభవము, విజ్ఞానము, పాండిత్యము, అన్నియు ప్రతిఫలించునట్లుగాను ప్రాచ్య పాశ్చాత్యకవుల తారతమ్యములను మాపించుచు మన ప్రకృతిస్థితిని గురించియు విపులముగా అనర్గళముగు ధారాశుద్ధితో మాట్లాడిరి- విశేషముగా హాస్యమును చిప్పిలజేయుచు ఉపన్యసించిరి-మరునాడు నిన్నటి దినము ఉస్మానియా కాలేజీలో ఆంధ్రవిద్యార్థులకు ఉపన్యసించిరి- సాయంకాలము సికింద్రాబాదులో ఉపన్యాసం చేసిరి- రాత్రి౨గంటలకు విశ్వనాథ సత్యనారాయణ గారు బెజవాడకు వెళ్ళిపోయిరి ... ... ...

ఈపుష్య బ॥౧౧ నాడు వేగంపేట శ్రీ శివరామదీక్షిత అవధూత పీఠ పరంపరలైన పీఠానాలకృష్ణ ప్రభు జోశీల వార్షికోత్సవము జరిగెను ౪౦౦మందికి పైగా వచ్చిరి.

---

### చర్చిల్ రూజ్వెల్టుగారలకు ఇండియాలీగు సందేశము

అమెరికాలో ఇండియాలీగు అను సంస్థయొక్క అధ్యక్షుడగు జగజిత్సింగుగారు చర్చిల్‌గారికి పంపిన ఒక సందేశములో ఈక్రిందివిధముగ నున్నది

"భారతజాతీయ కాంగ్రెసు తనవిధానములో క్రొత్తమార్పుచేసి భారతదేశములో చేయుచున్న యుద్ధప్రయత్నములకు తోడ్పడ సిద్ధపడుచున్నట్లు భారతదేశమునుండి ఇటీవల వచ్చిన వార్తలను వినిమాకు సంతోషమైనది... బ్రిటనుగాని భారతదేశముగాని వేరే ప్రజాస్వామిక దేశాలయావత్తుగాని భారతదేశంలో రాజకీయ ప్రతిష్టంభన తిరిగితలఎత్తుటకు అంగీకరించజాలరు. భారతదేశమును ఆకర్షించుకొనవచ్చుననియు, చిక్కును తప్పించవచ్చుననియు మా విశ్వాసము. మీరు సహజమైన ధైర్యసాహసోపేతమైన చర్యతో మీరు దీనిని సాధించవచ్చును. బ్రిటిషు రాజనీతి గాని భారతీయ రాజనీతిగాని ఈసారి నిరుపయోగము కాదని మనఃపూర్వకముగ మేము ఆశించుచున్నాము."

ఈసందేశముయొక్క ప్రతిని ఇండియా ప్రభుత్వమునకు కూడ పంపించుటకై యిచ్చినారు.

ఇదే ఇండియాలీగువారు రూజ్వెల్టుగారికి ఈ క్రింది టెలిగ్రామును పంపించినారు:—

"అమెరికాలో నివసించుచున్న భారతీయులమైన మేము జపాను నిష్కారణముగా అమెరికాపై దాడిచేసినందుకు మాకుకలిగిన పెద్ద ఆగ్రహమును వెల్లడించుచున్నాము. మేము వచ్చిచేరిన ఈదేశములో మేము అనేకములైన హక్కులను అనుభవించియున్నాము, స్వాతంత్ర్యమును ప్రజాస్వామికవ్యవస్థను రక్షించుటకై అమెరికా చేయు ప్రయత్నమును మేము సంపూర్ణముగా బలపరచుచున్నాము- ఈ చిక్కుసమయములో మాసేవను మేము ఒసగుచున్నాము, ఈసమయములో ఎన్ని కష్టాలు చిక్కులు అమెరికాకు వచ్చినను రానున్న స్వాతంత్ర్యపూరితమైన ప్రపంచములో తాను చేయవలసిన గొప్పపనిని నెరవేర్చుటకై విజయముతో బయటపడగలదనవిశ్వాసముతో నున్నాము"

---

జటప్రోలు సమస్థానము ననఘ

అదాలత్ నుంచి

తా॥ ౨౬-౭-౧౯౪౧ ఫ.

నెం. (౮౯)౧౯౪౧ ఫ

[వాది] చింతలపల్లి నారాయణాచారి

సా॥ కొల్లాపురం,

(బనాం)

పతివాదులు, వెంకమ్మ వగైరా సా॥ వనుములపాడు

దావా

భరణపొందుటకు హక్కు లేదని స్థిరపరచుట.

౧నాం. వెంకమ్మ బింత్ గురుమూర్తి కులం విశ్వ బ్రాహ్మణ-వయస్సు ౬౫ సం॥రంలు సా॥ వనుములపాడు. తాలూక నందికొట్కూరు కర్నూలుజిల్లా

పై మొకద్దమాలో పేషీ తా॥౩౦-౮-౫౧ ఫ, రోజు ఆదివారము ఏర్పాటుకయ్యియున్నది. కావున నీవు స్వయముగ లేక ప్లీడరుగా కాని హాజరు అయ్యి జవాబు యివ్వవలసినది హాజరుకాని యెడల ఏకపక్షముగా కార్యాయి చేయబడును

దై రామచంద్రరావు

మునసఫ్.

---

### విజ్ఞప్తి

భారతదేశము కొరకును హైదరాబాదు కొరకును యుద్ధము ఒక క్రొత్తరూపము దాల్చినది. హైదరాబాదు సైనికులు తాము స్వయముగ తమ ఇండ్లనుండి దూరముగ నుండియు హైదరాబాదును ప్రథమరంగమునుండి రక్షించుచున్నారు.

ఈ విషమకాలములో మన సైనికులకు మనమెట్టిసహాయము చేయగలుగుదుము అను ప్రశ్న మనలో ప్రతిఒక్కరు అడుగుచున్నారు. మనమందరము ప్రాణముల బలిదాన మియ్యలేము. కానిఇక్కడ సురక్షితముగనుండి యుద్ధమునందున్న మనసైనికులకు సహాయము చేయగలము. మహా ఘనతవహించిన శ్రీవారి హైనెస్ బేరార్ యువరాజు పోషకులుగా నున్న హైదరాబాదు యుద్ధావసరములనిధి మనకుసహాయముచేయు అవకాశమునిచ్చుచున్నది. ఈనిధికి మాసిక చందాల నిచ్చువారు ఎక్కువగ కావలెను, చందాల ధనము ఎంతతక్కువైనను సరే. క్షతగాత్రులును, రోగగ్రస్తులును ఐనవారికి ఉపచారము చేయు సంస్థలును, సైనికులకొరకు సౌకర్యములను చేకూర్చు సంస్థలును, క్రమక్రమాభివృద్ధి నొందుచున్న అవసరములకనుగుణముగ తమ కార్యక్షేత్రమును విశాలపరచుటకై ప్రతిమాసము ఎక్కువ ఆదాయము గల అవకాశమును కోరుచున్నారు. ఇప్పుడు హైదరాబాదు నెలకు ౫౦౦౦ రూపాయ లిచ్చుచున్నది. మన విహిత ధర్మముకంటె ఇది చాల తక్కువ. మీరు వెంటనే ఉదార విరాళములనిచ్చి మన సైనికుల నాదరింతురని నేను దృఢముగ విశ్వసించుచున్నాను.

అహమద్ సయీద్‌ఖాన్ ఆఫ్ ఛతారి,
హైదరాబాదు యుద్ధావసరములనిధి
వర్కింగు కమిటీ పక్షమున.

---

#### త్రాగిన బ్రిటిషుసోల్జర్ల కార్యము

బ్రిటిషుసోల్జర్లు కొందరు త్రాగి అమత్తులోము స్గరిని చంపి ఒకరికి పెద్ద గాయమును, మరిముగ్గురికి చిన్న గాయములను కలిగించినట్లు కొన్నూరుతుండి ఒక వార్తవచ్చినది.

---

### రాయలసీమమహాసభ

రాయలసీమమహాసభయొక్క మూడవసమావేశం రాయలసీమలోని తాడిపత్రిలో జనవరి ౧౭ తేదీన జరిగినది. అందు సభాప్రారంభకులయిన హెచ్-యం-సీతారామరెడ్డి బి-ఏ-బి-ఎల్-యం-యల్-సి గారుపన్యసించినదానిలో నీక్రింది విషయములు గమనింపవలసినవి.

"రాయలసీమయొక్క ఆర్థికాభివృద్ధినిగూర్చి ఒక్క ప్రభుత్వముమీద నాధారపడరాదు. ప్రజలును కష్టకార్యములను పైనవేసికొని విజ్ఞానముతో పనిచేయుచుండవలెను విజ్ఞానవంతులు ధనసంపన్నులు, పరిశీలనశక్తిగలవారు చేకపై పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించినచో అట్టిపరిశ్రమలకు ప్రభుత్వసహాయము తప్పకలభించగలదని నావిశ్వాసము. ప్రజల యార్థికాభివృద్ధి కావలయుననిన బ్యాంకుల నిర్మాణము ఆవశ్యకము, బ్యాంకులు లేనిదే వ్యాపారములు, పరిశ్రమలును వృద్ధికిరాజాలవు. రాయలసీమలో ఒకబ్యాంకు స్థాపించుటకెట్టి కష్టములనైనను సహించితీరవలయును. పెట్టు భూములందు భూమితనఖాబ్యాంకులు స్థాపించినచో వడ్డీవ్యాపారపిశాచముల బారినుండి రైతులు తప్పించుకొనవీలుండును. ఈవిషయమున రాయలసీమ రైతులు గట్టిపట్టుపట్టవలెను.

రాయలసీమ సమస్యలవిషయమై మదరాసు పత్రికలన్నియు చాలసహాయముచేసినవి వాటికి మనమందరము కృతజ్ఞులము గానుండవలెను. ఈ సమస్యలలో మనప్రజల కెక్కువయభిరుచికలుగునట్లు చర్చించుటకై యొకవార్తాపత్రిక మనకవసరము. ప్రస్తుతకాలమునుబట్టి వార్తాపత్రికానిర్వహణము దుర్భరమయినను రాయలసీమవారి విషయములను చర్చించి ఒకపత్రికను స్థాపించవలెను. ఆపత్రిక స్వతంత్రముగానుండవలెను.

దేశసేవలో రాయలసీమ గర్వింపదగిన స్థానమునందున్నది. ఈసీమ పటులకు,కవులకు, నేతలకును కాణాచి.

ఇంతకుముందెన్నడును, ఆంధ్రరాష్ట్రమక్కరలేదని రాయలసీమమహాసభ అనలేదు. రాయలసీమవారికి ముందుఆర్థికాభివృద్ధి కావలెననుటయే వారివాంఛ ఆంధ్రమహాసభవారు ముందు రాష్ట్రము సిద్ధింపవలయుననియు. తద్వారా సర్వము లభించుననియు నెంచిరి, శ్రీబాగుఒడంబడికలో సంతకములుచేసినవారు అఒడంబడికతో రాయలసీమవారికి ఇతరాంధ్రులకూగల స్పర్థలుపోవునని తలచిరి. కాని రాయలసీమవారాఒడంబడికను ఖండించిరి- నిజముగ మీరు రాష్ట్రనిర్మాణమావశ్యకమని తోచినచో మీరియిచ్చవచ్చినతీర్మానములతో నాఒడంబడికను సవరించుకొనవచ్చును, ఇటీవలజరిగిన ఆంధ్రమహాసభలోని తీర్మానములు, ఉపన్యాసములు, రాయలసీమవారికి మిగులననుకూలముగ చేయునున్నవి. ఆంధ్రమహాసభవారు మంత్రిపదవులను రాయలసీమవారికికూడ యిచ్చెదమనిరి. కాని సమయమువచ్చినపుడామాటలుబూటకములయ్యెను. వారిలోనే గిరాకీఎక్కువగానుండుటచే ఒకపదవియైననీయకలేక తుదకు ఖాళీపడవిరోసంగిరి,

రాయలసీమప్రజలు తప్పక మంత్రిపదవులను ఇతరఉన్నతపదవులను సంపాదించెదరు అదియితరులఅనుగ్రహముచేగాదు, మరి వారిస్వయంశక్తి త్యాగములచేతనే యావిలభింపగలవు.

---




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.